వర్ణంబులలో నోంకారంబు నిరవున నాయుధంబులఁ గార్ముకంబు సోయగంబున యజ్ఞంబులలో జపయజ్ఞంబు చాడ్పున వ్రతంబులం దహింస కరణి యోగంబులం దాత్మయోగంబు రమణ నోషధులయందు యవల సొబగున భాషణంబులందు సత్యంబు తేవ ఋతువులందు వసంతంబు ప్రౌఢి మాసంబులందు మార్గశీర్షంబు మహిమ యుగంబులందుఁ గృతయుగంబు నోజఁ) దేజరిల్లు. ఇట్టి భాగవత పురాణంబు పఠియించి విష్ణు సాయుజ్యంబుఁ జెందుదురు. అని మఱియు ని ట్లనియె.

క. సకలాగమార్థపారగుఁ, డకలంక గుణాభిరాముఁ డంచిత బృందా
రక వంద్య పాదయుగుఁ డగు శుకయోగికి వందనంబు సొరిది నొనర్తున్. 49

సీ. సకలగుణాతీతు సర్వజ్ఞు సర్వేశు నఖిలలోకాధారు నాదిదేవుఁ
బరమదయారసో ద్భాసితుఁ ద్రిదశాఖి వందిత పాదాబ్జు వనధిశయను
నాశ్రితమందారు నాద్యంత శూన్యుని వేదాంత వేద్యుని విశ్వమయునిఁ
గౌస్తుభ శ్రీవత్స కమనీయవక్షుని శంఖ చక్ర గదాసి శార్ఙ్గధరుని

తే. శోభనాకారుఁ బీతాంబ రాభిరాము
రత్నరాజిత మకుట వి భ్రాజమానుఁ
బుండరీకాక్షు మహనీయ పుణ్యదేహుఁ
దలఁతు నుతియింతు దేవకీ తనయు నెపుడు. 50

మ. అని యీరీతి నుతించి భాగవత మా ద్యంతంబు సూతుండు సె
ప్పిన సంతుష్ట మనస్కులై విని మునుల్ ప్రేమంబునం బద్మనా
భునిఁ జిత్తంబున నిల్పి తద్గుణములన్ భూషించుచున్ ధన్యులై
చని రాత్మీయ నికేతనంబులకు నుత్సాహంబు వర్ధిల్లఁగన్. 51

క. జనకసుతా హృచ్చోరా!, జనక[1]వచః పాలనాత్త శైలవిహారా!
జనకామిత మందారా!, [2]జననాదిక నిత్యదుఃఖచయసంహారా! 48

మాలిని. జగదవన విహారీ! శత్రులోక ప్రహారీ!
సుగుణవన విహారీ! సుందరీ మానహారీ!
విగత కలుష పోషీ! వీరవర్యాభిలాషీ!
స్వగురు హృదయ పోషీ! సర్వదా సత్యభాషీ. 49

---

1. వచోలబ్ధ విపినశైల (హ) 2. జనకాదిక (హ) జనకాది మహీశ్వరాతిచయ సంచారా(తం.)

గద్య. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర, కేసనమంత్రిపుత్ర, సహజ పాండిత్య, పోతనామాత్య ప్రియశిష్య, వెలిగందల నారాయణాఖ్య ప్రణీతంబైన, శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు రాజులయుత్పత్తియు, వాసుదేవ లీలావతార ప్రకారంబును, గలియుగ ధర్మప్రకారంబును, బ్రహ్మప్రళయ ప్రకారంబును, బ్రళయవిశేషంబులును, దక్షకునిచే దష్టుండై పరీక్షిన్మహారాజు మృతినొందుటయు, సర్పయాగంబును, వేదవిభాగ క్రమంబును, బురాణానుక్రమణికయు, మార్కండేయోపాఖ్యానంబును, సూర్యుండు ప్రతి మాసంబును వేవ్వేఱు నామంబుల వేవ్వేఱు పరిజనులతోఁ జేరుకొని సంచరించు క్రమంబును, తత్తత్పురాణగ్రంథ సంఖ్యలు నను కథలు గల ద్వాదశస్కంధము సంపూర్ణము.



శ్రీమహాభాగవతము సంపూర్ణము.

